రామిరెడ్డి, నారపరెడ్డి

# బాష్పకణాలు

నెల్లూరు, 1943

Record no. 102

Bibliographic Record Target

రామిరెడ్డి, నారపరెడ్డి.

బాష్పకణాలు / నారపరెడ్డి రామిరెడ్డి. - నెల్లూరు : ప్రభాత ప్రెస్, 1943.

vi, 59 p. ;17 cm.

Record no. 102

Rāmireḍḍi, Nārapareḍḍi.

Bāṣpakaṇālu / Nārapareḍḍi Rāmireḍḍi. - Nellūru : Prabhāta Pres, 1943.

vi, 59 p. ;17 cm.

Record no. 102

# బాష్పకణాలు







నారపరెడ్డి రామిరెడ్డి.

1943

వెల 0-8-0

హక్కులన్నీ గ్రంథకర్తవి







ముద్రాపకులు:

నెల్లూరు ప్రభాత ప్రెస్ వారు





# విషయానుక్రమణిక









---

## సవరణలు

| పుట | పఙ్క్తి | ఇప్పటిపాఠం | సవరణ |
|---|---|---|---|
| 5 | 7 | వల్లదని | వదలని |
| 20 | 16 | దేవు | దేవు |
| 22 | 11 | కోటీశుని | కోటీశు |
| 46 | 18 | ధనుజు | దనుజు |
| 51 | 14 | నీతళుకుచూపు | తళుకుచూపు |
| 53 | 6 | ఏయదృష్టమూర్తి | ఏయదృష్టపుమూర్తి |
| 56 | 1 | గండిచి | గడించి |

---



# పరిచయం



ఈ కవికుమారుడు, పుస్తక రూపాన, బహుశాంధ్ర ప్రపంచానికి నూతనాగంతుకుడు కాబట్టి యీ పరిచయపు మాటలు అవసరాలే!

ఈ కవి, పన్నెండు ఏండ్లనాడు, అంటే తన పదమూడో ఏట కవిత్వవాసనలు అలవరచుకొని, పెద్దల ఉత్సాహ వాక్యాల దోహదంతో పెంపొంద చేసుకొంటూ, అప్పుడప్పుడు రూపొందిన భావావేశాల ప్రకటించుకొంటూవచ్చి, నేడు వాటిని యీ గ్రంథరూపేణ ఆంధ్రలోకానికి సమర్పించుకొంటున్నాడు. ఆదినుండి ప్రోత్సహించి, యితని కవితావల్లరికి మారాకులు వెడుతూ, అల్లుకొను సహాయపడినవారిలో కవికోకిల - మనమండల ఆస్థాన కవిశేఖరుడు, (Poet Laureate of Nellore District అన్నమాట) మధుర కవి రామిరెడ్డిగారు మొదటివారు.

ఆతర్వాత వ్యాకరణం తిక్క ఒంట బట్టించుకోను, కల్లూరు వారి గుప్తార్థ ప్రకాశికలు కంటితో దీపాల పిచ్చయ్య (సంజీవిశెట్టి ఆస్థానకవి) గారిని సమీపించి, వారికి చెప్పను చేతగానందున వారికి ఒక ప్రతిని వదలి యిల్లుచేరినాడు. దీనితోనే, బహుశా యీయన కవిత్వం కుదుట బడింది అనుకొంటా. ఆదిలో అందరు నవ్యకవులు మాదిరే యీయనా ఆమనితోటలో పరాయివారి ప్రియురాండ్రపై బడినాడు. కాని, యీయన అదృష్ట వశాత్తు కాలంమారి నవ్యచేతన

భావాలతో రోదసి ముఖరితమైపోయిన ఆదనులో యీ యౌవక మానసంగూడ, అంతర్జాతీయభావాలలో - సర్వజనీన సౌహార్ద్రంలో మునిగిపోయింది. ఈకవితలో అదే ప్రతిబింబించింది. తత్ సమయవాతావరణంనుండి బయటబడను కొందరివలె యీయన ప్రయత్నించక, అందు వూరిన మారసజన్య ఊహాల ఆంధ్రీలోకానికి అర్పించినారు. ఈ యుగమతమైన సమాజవాదమే యీ ఖండకావ్యావళికి విషయము.

కవి కర్షకుడు కాబట్టి మనపూర్వకవులకు నిషిద్ధాలైనప్పటికిని, యథార్థమానవత్వానికి రూపాంతరాలైన కూటికిలేని కర్షక కార్మికులే వర్ణింపదగిన వ్యక్తులైనారు. వారి క్షుధార్తే భవభూతి కనుకంపకు పాత్రము కాదగిన విషయమని నిరూపించినారు. ఇవి నిర్జీవ అయః శాస్త్ర శాసనాలకు భిన్నాలైనా సజీవాలు కాబట్టి కవిగానంవల్ల తేజోవంతాలై శాశ్వత సత్యాన్ని చాటుచున్నవి. ఇవి యీ యుగ పోకడలు - వీటిని గుర్తించని కవిత మ్యూజియం వస్తువు అవుతుంది.

రామిరెడ్డి కవిత యిప్పుడిప్పుడే పాకానికి వస్తున్నది. ఆవేశం యీయనకు ఊర్పు. ఇక అలవాటు కవితను సానలుపెట్టి వెలయించ గలదు. దీనికితోడు, యీయన గ్రహించే విషయం అమరసత్యం కాబట్టి కవితకు స్థిరస్థాయి చిక్కగలదు.

ఒకటి రెండుచోట పునరుక్తి గాన్పించినా వెగటు పుట్టలేదు. కొన్నిచోట్ల భావయింకా కొంత సాన్యతను పొంది జాలిరావాల. మంచిబాణీలో పడింది కాబట్టి సంస్కారం దీన్ని పెంచి తీరుతుందనే విశ్వాసంతో వున్నా.

సహృదయులకు నచ్చితే రెడ్డి ధన్యుడు.

— శెలవు.

౧౫-౭-'౪౩ మరుపూరు కోదండరామరెడ్డి.

ప్రభాత- నెల్లూరు.

ఈ బాష్పకణాలు
సామ్రాజ్యతత్వపు ఇనుపపాదాల క్రింద
నలిగిపోయే పీడితవర్గ విముక్తికోసం
ఆత్మబలిదానంజేసిన
కయ్యూరు వీరసోదరులకు

## తొలినుడి ★

ఆకటిచిచ్చుతో నడలియూర్చెడు
లోకపు దీనరావముల్
సోకని మేడలం బ్రణయలోలత
మత్తిలు గొప్పవారితో
నాకు పనేమి? నావలె దినంబులు
బాధల వెళ్లబుచ్చు నీ
లోకపు దీనమానవుల లోగొను
కష్టపుగాథ వ్రాసెదన్.

---

# బాష్పకణాలు

## ఆశీస్సు ★

తన తెలినీటిముత్తెముల
ధారగ ధారుణికిచ్చి పేదయై
జని అగచాట్లపాలగు
విషాద పయోదము రీతి తానునున్
తన తనురక్తమాంసముల
ధారుణికిచ్చి ఫలమ్ము నెల్ల యా
ధనులకుపంచి దుర్భరవ్యధన్
కృశియించెడి బీదరైతులన్
జనని వసుంధరారమణి
చారుకృపామృత వృష్టి బ్రోచుతన్!

# కర్షక నిర్వేదము ★

కలమును కాగితంబుగొని కమ్మని
పద్యములు వ్రాయు చేతులన్
హలమును ముల్లుగట్టిగొని 'అట్టని'
యెద్దుల దోలుకొంచు భూ
తలమును జీల్చి పైరునిడి తత్ఫ
లితంబునఁ బొట్టఁబూడ్చుకో
గలిగితినంచు సంతసము గాని,
కవిత్వమువీడ దుఃఖమా.

ఎద్దులు కొ్రత్త, సేద్యమున కేనును
నూతన సేద్యగాడనే!
బిడ్డలు బిడ్డలై పగలు వారిన
అట్టుల కాడి మోపగన్
వద్దను పల్కలేక బసవన్నలు,
చిక్కులు పెట్టుచుండిరి, మా
యుద్దరి భావలోన వదియిం
పుడు బాధను దెల్పుభావముల్.





పదునున కేగి మొండెఁకు బాగుగ
నెండిన దుక్కి గడ్డలన్
పదునగు కత్తులట్లు మృదుపాదము
లెంతయు నొత్తుగోడ్వగన్
గదలగలేక బాధపడు నాకయి
నేను విచారమందనా?
వలదని బిడ్డలైన బసవన్నల
కష్టముగాంచి యేడ్వనా?

మాటలెరావుగాని మన మానవ
జాతికి గల్గు తెల్వి యే
పాటి పవిత్రధేనువుల బం
గరుబిడ్డల తెల్వియుండు? వే
యేటికి? నమ్మదో అసువులిచ్చి
కృతజ్ఞతజూపు రైతు లీ
నాటికిఁ ద్రావు గంజియుమునన్
వృషభంబుల కష్టభాగ్యమే!

కాలముమారె! ఈ యినుప కమ్మికి
రేకుకు బంగరట్లు యే

కాలమునందు లేని ధరగల్గెను!
రైతులధాన్య మన్న 'కం
ట్రో'లని గోలపెట్టి ధర
ద్రొక్కి-రి; పారయుకట్టు లేక నే
హాలికుడైన జేయగలడా
వ్యవసాయము నీవసుంధరన్?

పడమటిగాలి మొండెలకు ప్రాణులు
తందర లాడుచుండగా
విడువక బిడ్డలట్లు తను బెంచిన
యెద్దులకష్టపెట్టి తా
బడియు శ్రమంబు పంట ధనవంతుల
కొల్లకు నప్పగించియున్
గడుపునుమాడ్చుకొన్న కవి
గానికి ప్రాణము తీపియుండు నే?

―――





# కవితావిరహం ★

భరతఖండ మిద్ది, బాధువు లీర్ష్యాలు
లసలె కాపురంబు అప్పుబొచ్చె,
వృత్తిసేవ్య, మందు విత్తనాలకు రాదు,
కవితనెట్లు వ్రాయగలను నేను?

పరమదరిద్రులై పరగు భారత
కర్షకవర్గమందు సుం
దరతర నవ్య భావకవితా ల
లితాంగినిం బ్రేమకౌగిటన్
సరసతగూర్చుకొన్న నవసాహి
తి వేత్తకు కూడులేని ము
ష్కరభువి, గావ్యకన్యకకు
కర్షక వృత్తికి రెంటికిన్ జెరున్!

కన్నులువిచ్చి ఈవిమల కాంతుల
వెల్గు ప్రపంచఖండమున్
గన్నదినంబునాడె నవకం
బయి నీమ్నమహాస రేఖ నా

చిన్ని మనంబునందు వికసించిన
శక్తుల మేలుకొల్పి యే
యున్నత భావరాజ్యములకో
గొనిపోయె విలాసలోలతన్

చింతలవంతలంజివికి చిత్తము
భ్రాంతిఁగలంగి పో "విషా
దాంతము" వ్రాసి సుందర రహ
స్సుధలందు ఫలించు స్నేహమే
అంతము చేసి నాహృదయమందు
సమాధియొనర్చుకొంటి, నా
యంతటి మూర్ఖుడున్నె కవితా! క్ష
మియింతువె నాదుకృత్యముల్.

ఏ మధురంపు కాంతులొ మదిన్
గలగించగ, నీదు ప్రేమలో
కోమలభావ మాధురులఁ గూర్చి
కొనం దలపోసినంత భా
ధామయమైన నాబ్రిమకుదారులు
రూపముదాల్చి నిల్చె దే





వీ! మధురార్ద్ర చిత్తముఁ జలిం
పగజేయు భయంకరాకృతిన్.

లేమిడిసంసార మేమి దోచగనీక
కష్టాలఁగ్రుంగు నాకాంతగాంచి,
పత్రంబు వ్రాయించి పైకమిచ్చిన ఋణ
దాతక్రౌర్యైక తీక్ష్ణతదలంచి,

కడుపునిండఁగ గడ్డి గాదము లేకను
బక్కచిక్కినయట్టి పసులఁగాంచి,
సర్కారు పన్నుకై జప్తీలజేయు గ్రా
మాధికార్ల కఠిన మది తలంచి,
ధనికవర్గంపు దౌర్జన్యతల గలంగి.
నీరులేక వాడెడు వరిపైరుగాంచి,
కనలికృశియించు దౌర్భాగ్య కర్షకుండ
నీ మధురస్నేహ మేనెట్లు నిలుపగలను?
నీదు భావనలో మున్గి నిదుర లేని
సుందర స్వప్నరాజ్యాల సోలిపోవు
హృదయమున పాడులోకంపు సొదలు రేగి
చెడ్డకలయయి మూల్గెడు జీవితంబె!

# వెంకటేశ్వరా! ★

కలికాలంబున భక్త సంత
తుల సాకఁ వేంకటేశుండ వై
మలపైచేరి నినుం భజింప
మదిసంభావించి యేతెంచు వా
రల నున్నంగను బోడిజేసి
ధనముఁ రాల్పించి వారిఁ దుదిఁ
దలపై జెప్పనఁగొట్టి పంపెదవు
దవు, నీ దౌర్జన్య మేమందురా!

ధరణి సృజియించి పోషించు పరుడవంట!
యొక జమీందారువలె కొన్నియూళ్ళ నేలు
చుంటి వొక్కరాతిబొమ్మవు! చోద్యమిద్ది!
అప్పటికినైన పరితృప్తి నందలేక!

ఇతర పాలనమున గల్గు నెల్లజనుల
ధనికులనక పేదలనక తనివిసనక
వడ్డికిని వడ్డిబెంచి యపారధనము
లాగికొనుచుండు నీపేర లాబివారు.





ముడుపులుగట్టి యెల్లెడల ముం
దొకభాగము నీవటంచు దా
దడయక తెచ్చికట్టెదరు, త
ప్పియు కొంచెము కాలమేగినఁ
గడుపున నొప్పియో జ్వరము
కాళ్ళకు తీపులో వచ్చినంత నే
ర్పడర ధనంబు వడ్డి యప
రాధముఁ గూడ వసూలు జేతువే!

స్పెన్సరుబిస్కట్లు చింతజేయుగబోవు
పులిహోరముద్దలం దలరు తృప్తి,
సీమసారాయీల సేవజేయగబోవు
చల్లని సెలయేటి జలముచాలు,
'పోలో' గుఱ్ఱాలకై బుద్ధిపోనీయవు
ఆవులెద్దుల తోడి ఆటనీకు,
పరసీమలకుబోవు భావమే గల్గదు
తిరునాళ్ల పోకుల తిర్గుటొకటి,

మానవ జమీనుదారులకైనయట్టి
ఖర్చులందొక్కటియు నీకుగానరాదు

జనుల నోళ్ళను గొట్టిన ధనములెల్ల
ఏమి జేయుచునుంటిరో యేమొ యెఱుగ!

ఎదుప్రతినిధుల్ సేవకుల్ నిన్నుఁ జూపి
బ్రతుకు గడపెడు నామాలవారుగూడ
చెమటలూడ్చి ఫలింపగ జెందినట్టి
మాధనమె పీల్చుచుందురు మాయచేత.

ఈవు నీభృత్యులును ధనమెల్ల మ్రింగి
కుంటులకు గ్రుడ్డులకిడక కొండమెట్ల
వరుసలన్నియు నింపితే బాబు! మాదు
కండలను రక్తమును గూడ చెండుమందు.

ధనములేనిదె కాదు స్త్రీదర్శనంబు,
ధనములేక నీ మంగలి తలనుబోడి
సేయదు, ధనమునిడక నీచెప్పుదెబ్బ
ఒక్కటైన ప్రసాదింపరో ధనాఢ్య!



# కవి - కర్షకుడు ★

## — కవి —

భక్తి పరిపూర్ణమై పరవశంబునముంచు
దేవతారాజుల దివ్యకథలు,
వినినంత రక్తంబు వేడి యెత్తించెడి
ధీరుచిన్నపరెడ్డి వీరచరిత,
తలచినంతనె గుండె దడదడలాడించు
బొబ్బిలి వీరబెబ్బులులగాథ,
అనుకున్నయంతనే ప్రణయంబు పొంగు
'చల్ మోహనరంగడి' ముద్దుపాట,

కలుపుతీసెడు పల్లెతల్ వలపులొలుక
చిక్కని గళంబునెత్తి యచేతనములె
పరవశముజెంది పోవంగ బాడుచుండ,
వినుచు నెనలేని యానంద మనుభవించె
ధన్యుడవునీవె కర్షకా! ధరణియందు!

## — కర్షకుడు —

ఔర! విచిత్రమయ్యె తమరాడిన
మాటలు విన్ననాకు; నా
కోరిన సౌఖ్యజాలములు గూరెడు
రోజులు నాడెపోయె న
న్నా, "రవిగాంచజాలనిది యాకవి
గాంచు" నటన్న పల్కునే
డిరహి రిత్తమాయెనె, గ్రహింపగ
లేవె మదీయ దుస్థితుల్?

మిద్దెల మేడలన్ వలపుమించెడు
పూవులతోట బాగరుం
గద్దియగూరుచుండి తమకంబున
భావజగంబులందు నీ
విద్దెల ప్రేమసౌధముల బెంచి
విహారము జేయు నీకు యీ
కొద్ది కృషీవలుండు బడు
కుందు దలంపగఁ దీనునా కవీ?





పన్నుల చింత, లాపయిని
పైయధికారుల దాడికొంత, సం
పన్నుల అప్పుబాధ, లటుపై
వ్యవసాయపు ఖర్చు వంత లా
పన్నుని జేసివైచు గృహభారము;
జీవితమే భరంబుగా
నున్న నికృష్టహాలికునకున్
సుఖమున్నదె యీదినాలలో!

ఇట సకాలమునకు వర్షమేగురియదు,
కురిసినంత సంబరమె? యాగొప్పవారి
పొలములకు బారి, మిగిలిన కొలదియూట
లే గతులుమాకు; మాగోడు లెన్ని జెపుదు?

విందును కొన్నిమార్లు పరవిన్
మిముబోంట్లు వచింపుచుండ నా
నందమటన్నమాట, అది నా కగు
పింపదు, నెత్రిచెమ్మటల్
చిందగజేయుచుంటి లవలేశమునున్
లభియింపలేదు, ఆ

క్రిందనమే శరణ్యమా యికన్
ఫలమంతయు సోమరుల్ దినన్

ఆకటను మమ్ము జంపి తామనుభవించి
పూర్వజన్మకర్మమనియు పుణ్యమనియు
మతముపేర మమ్మోదార్చి మాయదేవు
నొకని గల్పించి మారక్త మూడ్చినారు.

ఇంతపక్షపాతి దయారహితుడు దేవు
డేని ధనికజనముల దాసుడే యగును;
పొడవనే వాని నాగేటి మడిమునోడ
తల చితికిపోవ కష్టజీవులు సుఖింప.

ఓగుపనెడు మందు నుగ్గుపాలనుగల్పి
పెట్టినారు మాదు పెద్దవారు,
యింతకాలమోర్చి తింక నోర్వగజాల
నేనుగూడ ధరణి మానవుడను!

బడుగై చిక్కి కృశించి, శల్యముల
ప్రోవైయున్న నాదేహ మీ
జడముల్ గాంచియె దుఃఖభారమున
నశ్రాంతంబు కుందుం, గవీ!





తడి సేయం దగదొక్కొ నీకలము
చింతాకంత నా యశ్రులన్?
పుడమిన్ భోగుల ప్రేమ వెఱ్ఱులకె
నీ ప్రొద్దెల్ల వెచ్చించెదే!

మా ఫలితమెల్ల పీల్చిన మదముచేత
ఎవ్వతో యొక్క పడతిపై నెన్నరాని
వలపు వెఱ్ఱిబడి పూలపాన్పులందు
విరహ శైత్యోపచారాల వేగునట్టి
రాజులకతలె దుఃఖవర్ణనలు గాని,

అగ్గిసెగ రగిల్చెడునట్టి యెండ
సోలిపడు యెడ్లగాంచి దిగాలుపడుచు,
దుక్కిగడ్డల కాళ్లు నెత్తురులుగ్రమ్మ
ఓర్పు తన కూతగా కృషి నొనరజేయు
హాలికుల కష్టకతలు భావ్యములుగావొ?

ఉడుకు దుమ్ముల కాళ్ళు వడిబొబ్బలెత్తంగ
హాలికు రాండ్రొందునట్టి శ్రమకు,
శ్రీమంతు కాంతకు చిగురులై పాదాలు
బంగారుపారాణి పస రహించె;

నెత్తి దుత్తను మోమునిండ చెమటబిందు
వులతో కృషికసతులోర్చుశ్రమను,
ఆరాచకన్యల కందమై గళముల
ముత్యాలసరములు ముదమునించె;

ఎండవానల కోర్చు మా యింతశ్రమకు
గూరుఫలితంబు కొల్లగొన్నారువారు,
వారిలో భాగహారివై వారికృతి
మంపుకీర్తి బాడెదు మాయమనుజడీవు!

రాజుల విరహావర్ణనల్ వ్రాసివ్రాసి
తనివిదీరక ధనకాంతలను దగిల్చి
అయ్యవార్లకు ఝుంఝూటమాడినావు
కర్షకుని నేటి కన్నీటి కతలువినరో!

కడుపుమండించు నా సొదల్ కథలుజేసి
వ్రాయదలకొన్న చాలవు వత్సరాలె,
కవివరా! సెలవు మరల కలసికొందు,
మరువకుండుము రైతుసోదరుని నన్ను!

---



# జీతాలముంత ★

మించు శ్రమకోర్చి అన్నమోయించు నేడ్చి
కండలును రక్తమే లేకయెండినట్టి
బడుగులము దీనుల మిదె మా పడినట్టి
గోడువినియైన మమ్ము కాపాడుమమ్మ!
కూలిజనములచింత జీతాలముంత!

ఎముకలరుగంగ జేసిన యింత శ్రమను
అక్రమంబున కనుమరాసి అపహరించి
భోగములదూగు ధనికుల పొంతజేరి
తిరిపెమటు వారలిచ్చు బత్తెమున నీవు
సగము కుంచించి మమ్మిటు చంపుదుంటె?
కూలిజనములచింత జీతాలముంత!

ఆకటను మమ్ముజంపి తా మనుభవించి
పూర్వజన్మకర్మమునియు పుణ్యమనియు
మతముపేర మమ్మోదార్చి మాయ జేయు
వారిమాయల నొకమాయవై జనించి
మాకడుపుమాడ్చి మముజంపు మారివైతె?
కూలిజనముల చింత జీతాలముంత!

మా బడుగు దేహములుగాంచి మా విషాద
దీనరవములువిని, ప్రాణమేని లేని
శిథిలశిలలే కఱగి పారి కాల్వగట్టె,
మనుజుని కటికిగుండెలే తొణకవాయె!
మమ్ము నీవైన రక్షించి మనుపవమ్మ!
కూలిజనములచింత జీతాలముంత!

తనువు తనువెల్ల వార్చికె ధారవోయు
నీట్టి మనుజుంప నిన్ను సృజించినారు;
అడచినను ఆగరాని ఈకడుపుచిచ్చు
కాల్చుచుండునె ధనికవర్గాల నెల్ల?

న్యాయమని ధర్మమని మాయనాటకాల
నాడు పెద్దమనుష్యు లేనాడో నీకు
తలను రెండువేళ్ళవడుస తగ్గిపోవ
గొరిగినారు, మాకడుపులే తరుగ లేక!

తోడి మనుజులు మమ్మిట్లు త్రోసివైవ
దేవుడనెడు వాడున్న మాదిక్కు గనడె?
వుండెనో లేడో మాకేల యుత్తగోల?
నేడు మమ్ముల కాపాడ నీవె గతియ
పేదజనములచింత యో పిచ్చుముంత.







# నా రాజ్యము! ★

ఒకని కష్టాని కాసించి యూగుకొనక
యొడలి చెమటూడ్చి యీభూమి తడిపి దున్ని
సస్యసంపూర్ణజేసి యశంబుగాంచు
రైతుబిడ్డను నేను, నారాజ్యమిద్ది!

తరిగిపోవని సస్యసంభరణమైన
ధరణి మనసారనమ్మిన ధర్మమూర్తి,
ఎన్ని విప్లవంబులకు నొక్కింతయైన
చలన మొందని శాంతివిస్తారుడైన
రైతు బిడ్డను నేను, నారాజ్యమిద్ది!

ఫాలుముఖగల నాగేలు కేలబట్టి
భృత్యవరుడగు వృషభేంద్రు పెంపుచేత
ధరణి గర్భంబుజీల్చి రత్నాలుదెచ్చు
రైతుబిడ్డను నేను, నారాజ్యమిద్ది!

మాయమర్మము లెరుగని మనసుతోడ
రక్తమాంసాలు కరగించి [illegible]సి,



నాగరికుల మోసాలులో నలగి కలగి,
వారికర్పించి ఈర్ష్యల భంగపడని
రైతుబిడ్డను నేను, నారాజ్యమిద్ది!

ఎన్ని యుగములు గడచెనో యే మొగాని
ఆయుధము హాల ముక్కింత యరిగిపోదు
మావృషభరాజు అట్టైన మంటగనదు
బడలికనుమాట చెప్పడు నుడువబోని
రైతుబిడ్డను, ప్రకృతి నారాజ్యలక్ష్మి!

అవని శాసించురాజు సింహాసనంబు
పోటు బంటగు వీరుని పోతరంబు
విట్టవీగెడు కోటీశుని విభవమెల్ల
ఎవని స్వేదాంబు కణముల నెసగునట్టి
రైతు బిడ్డను నేను - నారాజ్యమిద్ది!





బాష్పకణాలు

# ప్రబోధం ★

శ్రీవసుంధరారమణి విశేషకరుణ
రైతుబిడ్డలు విజ్ఞాన రమ్యులగుచు
సంఘ సంస్థాపనోత్సాహ శక్తిగలిగి,
ఆత్మ సౌఖ్యోన్నతిం జెంది యలరుగాత!

రైతుప్రభాతమయ్యె! తిమిరంబులు
వీడె, ప్రబోధరావముల్
చేతము రంజిలంగ నవజీవన
కాంతులనిండె నెల్లెడన్,
ఈతగుణంబు వ్యర్థమొనరింపక
రైతుకుమార, రమ్ము బా
లాతపకాంతులందు హృదయాబ్జము
ముట్టిన చీకు లంతమౌ.

లెండోయీ! యిక నిద్దురం విడిచి,
మీరెల్ల కాల మాహాత్మ్యముల్
కొండల్పిండి యొనర్చు మీబలములన్
గూర్పించి వేవేగమే

రండీ రైతు కుమారులార! యిట
మీరగజేరి మీకష్టముల్
ఖండింపగల యోచన ల్సలుపుడీ,
కార్యాను కూలంబుగన్.

పసుల సౌకర్యముల్ పాడుగా నుంటచే
పసుల నష్టపు ఋణభార మొకట,
పంటలు మరిమరీపాడైన కతమున
వ్యవసాయపుం ఖర్చు వంతలొకట,
అన్ని రీతులగ్రుంగి అలవటించెను నీకు
సర్కారుశిస్తుల జ్వాలలొకట,
ఆర్థిక దుస్థితి అల్లాడు నీకు సం
పన్నులచే ఋణబాధయొకట,

అన్నియును చుట్టుముట్టి నిన్నకట! నేడు
పీల్చి పిప్పి జేయుచునుండ వివశుడవయి
చేతమెల్లను క్రుంగిపో రైతుబిడ్డ!
దిక్కులరయుదు, విధియెట్టి దిన్నములయ్యా!

కండలు రక్తముం గరగి కార్చినయట్టి
శ్రమంబుతోడ నీ





పండినపంటయెల్ల ధనవంతుల
కర్పణజేసి, యీగతిన్
తిండికిలేక పస్తుబడి దేహము
లెండిన యాలుబిడ్డలన్
గుండెలువ్రీల గాంచి వెతగుందుచు
నుంటివె రైతుసోదరా?

ఇంతటి కష్టముల్ బొరసి యీ
గతిని స్గబళించుచున్న నా
వంతయు లక్ష్యపెట్టక, సదా
కృషి జేసి దరిద్రభారమున్
పంతముతోడ ఢీకొనుచు
బాధలజెందుచు నెన్నినాళ్లు లీ
వంతున జీవితంబు గడుపందగు
నయ్యయొ! యింకనైన నీ
వింతపథంబుమాని కడువేగమె
మేల్కొనుమయ్య సోదరా!

దీనదృష్టులతోడ దిక్కులు తిలకింప
ఫలమొకింతయు నీకు గలుగబోదు,

రైతు సంఘంబుల ప్రతియూర స్థాపించి
రైతుల బలమెల్ల రాసిజేసి,
నిరత కార్యోత్సాహ నియతులై
తమశక్తి కష్టాల కెదురొడ్డ గలిగిరేని,
ఆర్థిక మాంద్యంబు లడుగంటు నానాడె,
రైతుసౌభాగ్యంబు రాణజెందు,

మనసు నీరుజేయు మానకష్టనష్టముల్
నోరుగల్గి ప్రభుల గోరుకొనక
మూల నొదిగియొదిగి ముగ్ధులమైయున్న
గతులు లేవు నేటికాలమందు.

అన్నా! రైతుకుమార! మేల్కొనుము
నీయాశాలతల్ నేటికే
నున్నాలయ్యెనటంచు దల్పకుము, నీ
శోకంబులన్ బాయగా
తెన్నే లేదనుకోకు, నీమది నిదే
దీక్షన్ సదా రైతు సం
ఘౌన్నత్యంబున కీవు పాటుబడినన్
ఆనందమే యబ్బెడిన్!

---





# నవ్యకవిగానం ★

ఓకవీ! ఓకవీ!
ఒకమాట వినవోయి,
కష్టజీవుల కథలు
కనలేవ? వినలేద?

కష్టజీవుల దోచి
కటికరక్తముదాగ్రిన
దోపిడిగాండ్రనే
దొరలుగా వ్రాశావు
గొప్పవారన్నావు
కీర్తిపరులన్నావు!

పేదవారలపీల్చి
పిప్పిజేసేవారి
ఘోరకృత్యాలనే
వీరకృత్యాలుగా,
అన్యాయకార్యాల
న్యాయరక్షణలుగా-
కథలల్లివ్రాశావు!
కావ్యాలుజేశావు!

కటిక యెండల్లోన
కాళరాత్రుల్లోన
పెనుతుపానుల్లోన
తేళ్లుపాముల్లోన
ఎముకలూ కండలే
అరిగిపో కష్టించి
రక్తమే చమటగా
రాల్చిపండించాడు
ధాన్యంపురాసులను;
ధనికవర్గంవారు
దోచుకొనిపోవంగ
గంజినీళ్ళకుకూడ
గతిలేకయల్లాడు
కర్షకుని దైన్యంపు
కన్నీటి కథలనే
కనలేద? వినలేద?
పొగలలో పొగయగుచు
మరలలో మరయగుచు
యంత్రాలలో నలిగి
ఇంతలో కానికి
అంతసామాగ్రిని
సరఫరాజేసాడు;





చావు బ్రతుకుల్లోన
జీవచ్ఛవంబట్లు
జీర్ణించిపోయాడు
తన కష్టఫలితమును
తన రక్తమాంసాలు
పెట్టుబడిదారులే
పట్టపగలే దోచి
హాయిగా వారిట్టు
లనుభవించుచు నుండ
కటికపస్తుల తోడ
కటకటాపడుచున్న
కార్మికుని దైన్యంపు
కన్నీటికథలనే
కనలేద? వినలేద?
ఇంద్రులని చంద్రులని
యేమేమొ పొగడుచు,
కల్లబొల్లికథల
కల్పించి చెప్పుచూ
'బూర్జు'వా లిచ్చోడి

పూటబత్తెము తోడ
కడుపునిండా మెక్కి
గిర్రున్న త్రేపుచు
మడతకుర్చీ లోన
మైమరచియున్నావ?
ప్రేమవీథుల్లోకి
ప్రియసిని దలపోసి
విరహగీతా లల్లి
విస్తుపోతున్నావ?
నీకడుపు నిండింది
కర్షకుని కష్టంబు
నీకు శుభమిచ్చింది
కార్మికుని కష్టంబు
నీసుఖాధారులా
వారినే దలపవా?

ఓయి! కృతఘ్నుడా!
మాయప్రచారంబు
మానుమా యికనైన,
సామ్యవాదపు సూర్య





స్వాతంత్ర్య కిరణాల
దివ్యతేజము నేడు
దిశలెల్ల వెలుగొందు.
లోకాని కన్నమిడి
సాకేటి కర్షకుడు
లోకాని కన్నియిడి
సౌఖ్యమిడు కార్మికుడు
తనహక్కు గుర్తించి
ధనిక తంత్రాలనే
తెలిసికొన్నాడిప్డు
లోకాన్ని శాసించి
కష్టజీవుల ప్రభుత
కల్పింపనున్నారు
ఆనవ్యకాంతిలో
అసత్యరాజ్యాన
ప్రాతపుంతలనున్న
పనికిరావికనీవు.
వీధిలో చెత్తవలె
విసరివేతురు నిన్ను

కడుపుమంటల గుందు
కష్టజీవుల సొదలు
కథలు కావ్యాలల్లి
సత్యాన్ని లోకాన
చాటించుమికనైన.

నీచత్వమునుమాని
నీకృతజ్ఞత దెల్పి
నిజమైన కవివిగా
నీవు వర్ధిల్లుమోయి
ఓకవీ! ఓకవీ!

---

## వైపరీత్యం ★

తోడిమానవు లాకట మాడుచుండ,
ధనికముష్కరుడొకడు విత్తంబునెల్ల
గుళ్ళుగోపురాలకుబెట్టి గొప్పకొరకు
రాతిబొమ్మలకుత్సవాల్ ప్రబలజేయు.





శ్రామిక జీవులకష్టాల సంగ్రహించి
దివ్యసౌధాల హాయిగో దేలునొకడు,
కష్టజీవి కాతని దయాదృష్టికొరకు
వీధిపంచల ప్రాణాలె విసిగిపోవు.

చలికి వానకు నెండకు నిలువలేక
గుడిసెకై యొక్కదీనుడు కుంగుచుండు.
హైందవోపల రమ్యహర్మ్యాలలోన
తూగుటూయెల లందొక డూగుచుండు.

మండుటెండల కష్టించి కండలరుగ
పొట్టగడువక అల్లాడిపోవునొకడు,
చల్లదనముకొరకు వేలు కొల్లబెట్టి
కొండలను జేరి నీటుగా కులుకునొకడు.

మానమునుగాచుకో జీర్ణమలిన వసన
మైన దొరకక కొందరల్లాడుచుండ,
పట్టువలువలకై వేలు పాడుజేసి
తనదు ఘనతను ప్రకటించు మనుజుడొకడు.

ఎముకలరుగ కష్టించి పండించునట్టి
రైతుబిడ్డ నౌర! మొరటు రాయుడనిరి,

వానికష్టంబు హరియించి తాను మెక్కి
తిరుగు మోసాత్ము ప్రభునిగా పరిగణింతురి.

ఎవ్వరో స్వార్థపరులు సృజించినట్టి
పాడుసంఘము మనుజుల గోడువెట్టి
హెచ్చుతగ్గుల గల్పించు నీజగాన
బ్రతుకు తీపని పల్కిన పాపియెవడు?

---

## నిరాశ ★

నాగుండెలో మంట
నాగొంతులో బాధ
నాకడుపులో చిచ్చు
ఏనాటికైనను
        చల్లారి నేనింక సుఖియింతునా?
        అల్లాడి యిటులనే మరణింతునా?
నారక్తమును దాచి
నాకండలను నమిలి,
నాపైన అధికార





నటనజేయుచు నున్న
        తప్పుపద్ధతియింక దగ్ధమౌతుందా?
        కనలి నాబ్రతుకిల్లు కాలిపోతుందా?
నాకష్టఫలితమును
నాకే దోపిడి జేసి
అన్నమన్న మటంచు
అల్లాడ జేసిన
        తప్పుపద్ధతియింక దగ్ధమౌతుందా?
        కనలి నాబ్రతుకిల్లు కాలిపోతుందా?
ఎండలో వానలో
బండనై పోయాను
బురదలో ముండ్లలో
పూడిపోతున్నాను
        తప్పుపద్ధతియింక దగ్ధమౌతుందా?
        కనలినాబ్రతుకిల్లు కాలిపోతుందా?
పాలులేకల్లాడు
పసిబిడ్డ యేడ్పుతో
కూడుగుడ్డల కేక్పు
కులకాంత యేడ్పుతో
కుమిలిపోతున్నాను

తప్పుపద్ధతియింక దగ్ధమౌతుందా?
కనలి నాబ్రతుకిట్లు కాలిపోతుందా?

ఎముకలను కొరికేయు
ఇంతచలిలో గూడ
ఈతోరి గుడిసెయే
ఊదింపి చాపవేసె

తప్పుపద్ధతియింక దగ్ధమౌతుందా?
కనలినాబ్రతుకిట్లు కాలిపోతుందా?

ఇంద్రభవనములందు
పట్టుపాన్పుల వారు
కమ్మనీ తియ్యనీ
కలలు గంటున్నారు

తప్పుపద్ధతియింక దగ్ధమౌతుందా?
కనలి నాబ్రతుకిట్లు కాలిపోతుందా?

ఎముకలన్నీ విరిగె
కండలన్నీ తరిగె
జీవచ్ఛవంబునై
జీర్ణించిపోయాను





తప్పుపద్ధతియింక దగ్ధమౌతుందా?
కనలి నాబ్రతుకిట్లు కాలిపోతుందా?

కష్టజీవిని నేను
కటికలోకము నన్ను
కాల్చివేస్తున్నదీ
మాడ్చివేస్తున్నదీ

తప్పుపద్ధతియింక దగ్ధమౌతుందా?
నిప్పులా నన్నిట్లు మాడ్చివేస్తుందా?

---

# దివ్యతేజం ★

దిక్కులేని మన - దేశంకోసం
తిండిలేని మన - దీనులకోసం
దాస్యంజేసే - దాసులకోసం
బలములుజారిన - పతితులకోసం

రక్తము గురిసిన
ధీరమూర్తులను కన్నారా?

ప్రాణాలిచ్చిన
పావన చరితల విన్నారా?
భాగ్యము విడచీ - భోగము లడచీ
దేశంకోసం - దీనులకోసం
సంఘంకోసం - సత్యంకోసం
స్వార్థం లేక - వ్యర్థం గాక

రక్తాన్నిచ్చిన
స్వార్థత్యాగులను గన్నారా?
ప్రాణాలిచ్చిన
పరమత్యాగ కథ విన్నారా?

మతము పేరితో - మాయలు జేసీ
భోగంకోసం - సత్యం బాసీ
బీదల రక్తం - పీల్చి మదించిన
ధనికుల పాలన - ధనికుల దర్పం

సాగే రోజులు
కూలిపోవునట విన్నారా?
సమానవాదుల
సత్యం విని మేల్కొన్నారా?





మతములు విడిచీ - మాయల నడచీ
నవీనయుగమిది - నవీనరాజ్యం
శాంతిస్థాపన - జరిగేరోజులు
కర్షకులారా - కార్మికులారా
కన్నులు తెరచీ
దివ్య తేజమును కనరండీ!
వీనులు విప్పి వీరనాదముల వినరండీ!!

---

## జమీన్ రైతు ★

కండలును రక్తమే లేక యెండినట్టి
బడుగు మేనున ప్రాణాలె తడబడంగ
అస్థిపంజరమువలె నడాడుచున్న
ఇంత దీనమానవుడ నీ వెవడవోయి?
చిరుతగాలికె దేహంబు సొరిగిపోవ
ప్రియుడుగులోన హృదయభారంబు పిదుల
ఇంత భారంబుగా నడుగులీడ్చుకొనుచు
ఈ ప్రయాణంబు సాగింతు వెచటి కోయి?

కొండలను పిండిగొట్టు ఈకోడెప్రాయ
మందె నిన్ను వృద్ధాప్యంబు నందజేసి
గుండియల గాల్చివైచె సేఘోరవ్యథలు
తెలుపుమోయి, నీమది బాధ కలుగదేని!

*　　　　*　　　　*

అడుగవలెనె నీవెవడవటంచు నన్ను?
తెలుసుకొనలేవె సఖుడ! నాతీరుగన్న?
నొక జమీందారు రైతుగా నుందు ననుచు;
యిట్టి ఎముకలప్రోవు లింకెచట గలవు?

దయయెరుంగని యొక జమీందారు గ్రామ
మున వసించెడి దురదృష్ట జనుడనేను,
తరతరాలనుండియు తాతతండ్రులెల్ల
పరువుగా పౌరుషంబుగ బ్రదికినారు,

ఇంత కొండ్రియుండెను ఈదరిద్ర
దశకు ముందు, కష్టపడియు దానిఫలిత
మింత మేము దిని, పరుల కింతబెట్టి
కొరవలేక బ్రదుకు రైతులము మాది.





జీవనదివలె బారు మాచెరువువరవ,
వరుస ముక్కార్లు నీరిచ్చు చెరువుమాది,
మేలిబంగారుబండు పొలాలుమావి,
కష్టముకోర్చి కృషి జేయగలము మేము.

ఎన్నియున్నను ఫలమేమి? “అన్నియుండె
ఐదవ తనంబె తక్కువ”యన్న రీతి
ఆజమీందారు ఘోరకృత్యాలవలన
సర్వనాశనమయ్యెనో సఖుడ, నేడు.

తెగిన చెరువుకట్టను పూడ్చు దిక్కులేక
కాల్వనీరెల్ల సంద్రాన గలసిపోవ
కడకు మాపొలాలటు వల్లకాడులయ్యె;
కూడులేక చచ్చినవారి కొఱకు బాబు.

ఏ ప్రభుత్వ మెఱుంగని హెచ్చుపన్ను
లిచ్చుకోలేక అసలు మేమేడ్చుచుండ,
పంటపండని యేడుల పన్నుకొఱకు
ఆస్తులను జప్తుజేసి మన్నింపినారు.

మా పశువుల మామూలుగా మేపికొనెడు
కంచెలు బిగించి పశువుల గట్టివైవ,
బందెలిచ్చుకోలేక యాపశులగూడ
వారికే తర్పణంబులు వదలినాము!

గాంధిచే రామరాజ్యమన్ ఘనత కెక్కి
ఎసగు మైసూరు రాజ్యమే యెంతో మేలు
ప్రజల నీగతి హింపించి బాధపెట్టి
చంపరట! ఒక్కసారిగ జచ్చునటుల
కాల్చివైతురు కష్టాలు గడచిపోవ.

ఎన్నియని వారిరాక్షసకృత్యములను
చెప్పగలనయ్య గుండెలే చెదరిపోవు!
ఆడువారి మానాలు కాపాడలేక
తలలువాల్చి అనదలమై నిలిచినాము.

ఆవిచారణ కమిటీకి అల్లనాడు,
వారిఘోరాల వివరించి పల్కెననుచు
కొల్లి బుచ్చయ్యనాయుని గొట్టినారు
ఎముకలన్నియు తునకలై విరిగిపోవ.



# భిక్షకుడు ★

అడవుల నరికీ - కొండల ద్రవ్వీ
భూమినిజీల్చీ రక్తంగురిసీ
రైతూ కూలీ - అన్నాదమ్ములు
పంటలు పండించారె-

బక్కపేగులా - చింపిగుడ్డలా
బడుగుమనుజులు - రెయ్యింబగలూ
చేసినకష్టం - ఫలితంబంతా
కొల్లకు పోసీ - పెట్టెలదాచీ
భోగలాలసులు మింగారు.

ఇన్ని జేస్తే - మిగిలిందేంది?
పాలిపోయినా - బడుగుదేహమూ
పాలకు జచ్చిన - బాలిక శవమూ
కూటికి యేడ్చే - కుర్రాని యేడ్పూ
నేలకంటినా - రోగి పెళ్ళమూ
తొట్టి గుడిసెయే మిగిలింది!

భార్యకోసం - బిడ్డని కోసం
ఆకలికోసం - అన్నంకోసం

కడుపుమంటతో - కళ్ళనీళ్ళతో
మొట్టఎండలో - కటికగుండెలా
ధనికుని వాకిట నిల్చాడు.

పాలగచ్చు కళ - దేలుమిద్దెలో
పాలుపెరుగూ - మేలౌకూడూ
భార్యాబిడ్డలు - తానూ మెక్కి
పట్టెమంచమున - పట్టుపరుపుపై
హాయిగ ధనికుడు చేరాడు.

'కూడులేని కూ - లోళ్ళం బాబు
భార్యాబిడ్డల - ప్రాణంనిల్వదు
ఇంత కబళ - మేయించాల
ఇన్నిగంజి పోయించా'లని
ధనికుని వాకిట అరిచాడు.

హాయి కలలనూ - భంగంకలిగి
కోపంతోను ధనికుడు లేచీ,
'వేళాపాళా - లేదా ముద్దా?
పొమ్మ'ని గద్దించాడు.





'పున్నెముంటది - బాబూ మీకు
కుక్కకు వేసే - కూట్లోసగమే
వేస్తేచాలూ - చారెడుగంజె,
ప్రాణం నిలుపుం'డన్నాడు.

'సాకా మొనుమూ - పలికే' దంటూ
దుడ్డుకర్రతో - ధనికుడు దూకి
కూలీసోదరు - బక్కమేనిపై
రెండేదెబ్బలు వేశాడు.

నేలనుబడ్డా - కూలిని బట్టీ
వీధికిదోసి - 'మదిలోమంటా
తీరిం' దంటూ - ధనికుడుమాత్రం
హాయిగ శయ్యను జేరాడు.

మొట్టఎండలో - మాడు దుమ్ములో
ధనికరాక్షసుని - హింసకు గురియై
భార్యాబిడ్డల - తలచి కుమిలినా
ఎముకలగూడౌ - కూలీదేహం
దారినబోయే - బాటసారి గని
'పాపం! చచ్చాడ'న్నాడు.

# కార్మిక కర్షకశక్తి ★

మతము పేరితో - మాయలు జేసీ
బక్క బడుగులా - రెక్కలకష్టం
ఫలితంబంతా - దోపిడి జేసీ
భోగలాలసత - పొగ్గులంబురిచ్చే
మనుజుల్లారా - ధనికుల్లారా
కార్మిక కర్షక - శక్తిసముద్రం
ఘూర్ణిలుచున్నది - చూడండోయ్!
దాని నాపి మన లేరండోయ్!

కాటికి గుడ్డకు - కూడానవసి
దేవుడయంటూ - దిక్కుల్జూస్తూ
యేడ్చేకళ్ళు - కురిసేరక్తం
దోసిళ్ళది - త్రావి మదించిన
మనుజుల్లారా - ధనుజుల్లారా
కార్మికకర్షక - శక్తిసముద్రం
ఘూర్ణిలుచున్నది - చూడండోయ్!
మాయనాటకముల - మానండోయ్





పూర్వకర్మముల - కబుర్లుజెప్పుచు
దేవుని పేరా - దెయ్యము పేరా
గుళ్ళుకట్టి - రాళ్ళునాటి
మోసాలు జేసీ - ఘోరకృత్యములు
సాగేరోజులు కూలిపోవు నిక
కార్మికకర్షక - శక్తిసముద్రం
ఘూర్ణిలుచున్నది - చూడండోయ్!
దాని నాపి మన లేరండోయ్!

బడుగు మనుజులా - బక్క పేగులా
ఆకలిమంటల - అగ్నికీలలకు
సోమరిపోతుల - భోగలాలసుల
సౌఖ్యప్రపంచము - మాడేరోజులు
తప్పవుతప్పవు - దగ్గరె యున్నవి
కార్మికకర్షక - శక్తిసముద్రం
ఘూర్ణిలుచున్నది - చూడండోయ్!
మాయనాటకముల మానండోయ్!

వారు సృజించిన - చచ్చుసంఘమూ
దోపిడి సంఘం - దొంగల సంఘం
కుంగుకేళ్ళతో - కూలిపోవునిక

సమానవాదుల - సత్యసంఘమా
రైతుకూలీ - నవీనరాజ్యాం
నవశక్తులతో - స్థాపనజరిగే
మంచిదినంబది - కాలపు తెరలో
విశ్వదీప్తముగు - ధాముల రాగిలె!
కార్మికకర్షక - శక్తిసముద్రం
ఘూర్ణిలుచున్నది - చూడండోయ్!
దాని నాపి మన లేరండోయ్!
మాయనాటకముల మానండోయ్!!

---

## దుఃఖమూర్తి ★

జీర్ణచేలంబు ధరియించి, చిక్కువడిన
వేణిబంధంబు వెన్నాడ, వెతలబడుచు
శల్యపంజరమాత్రవై సడలిబడలి
గాలిగర్భాన నేడ్పులు గరగిపోవ,
ఏలదుఃఖించుచుంటివి? నీవెవరు తల్లి?





దీనమూర్తివై యిట్లు నీదీనదృష్టి
నలుదిశల బరపి, నిరాశ నలవరించి,
వేడినిట్టూర్పుల చిగురుపెదవి యదర
గాలిగర్భాన నేడ్పులు గరగిపోవ
ఏలదుఃఖించుచుంటివి? నీవెవరు తల్లి?

దుఃఖవారాశి తరగలై పొర్లు నీకు
చూపుకొన నాకునొకసారి జూడచూడ
క్రోధవీరరసంబులు గురియుచుండు;
దేహమెల్ల గంపించ నుద్రిక్తవగుచు
వీరరౌద్రరసంబులు వెల్లివిరియ
నేలకంపించుచుంటివి? నీవెవరుతల్లి?

కాలగర్భాన లీనమై కానరాని
దైన, పూర్వపుఔన్నత్య మొకట! నేడు
తలచుకొన్నంత హృదయంబు కలగునేమొ!
గాలిగర్భాన నేడ్పులు గరగిపోవ
నేలదుఃఖించుచుంటివి? నీవెవరు తల్లి?

నీకుపుత్రులు దుష్టులై నీకుద్రోహగి,
నీహితము వేడచెవిబెట్టి నీమలగుచు

పూర్వయశమును చెఱుపంగ బూనినారొ!
గాలిగర్భాన నేడ్పులుగరగిపోవ
నేలదుఃఖించుచుంటి? వీవెవరు తల్లి?

పూర్వమెంతయు ఘనమైన భోగభాగ్య
విభవములదేలి యాడిన వెలదివనుచు
దెప్పకదె తెల్ప నీమోము తీరుగన్న,
గాలిగర్భాన నేడ్పులు గరగిపోవ
నేలదుఃఖించుచుంటి? వీవెవరు తల్లి?

సుగుణశీలంబులను బుధస్తుతినిగన్న
భరతనారీమణుల ప్రతి ప్రతిమవోలె,
వీరపురుషులగన్నట్టి వీరమాత
వోలె. కనులకు గన్పట్టు చుంటివమ్మ!
వీరరౌద్రరసంబులు వెల్లివిరియ
నేలగంపించుచుంటి? వీవెవరు తల్లి?

———





# దేవాలయంలో ★

పాటుపోటులసంద్రంబు పగిదిమిగిలి
ప్రణయవాహిని పొంగు లేబ్రాయమందు
ఏమిఫలములుగోరి శ్రమించెదీవు
కరకురాతికి నీయెద కాన్కవెట్టి?

వరుస పదునాల్గువర్షాల వయసునందె
చిగురుపాదాలు కంద నెవ్వగలగుంద
శిలలచుట్టు ప్రదక్షిణల్ సేయుచుందు
నేకఠోరహృదయులు శాసించినారొ!

పేదజనముల రక్తాల బీల్చివైచు
ఆ ధనాఢ్యుల ఘోరకృత్యాలనెల్ల
మాయలో దాచినారు యీమతగురువులు
గుడులుగట్టి దేవు నొకనిగూర్చి యచట

ప్రణయమూర్తి తపస్సది ఫలితమొంద
నే మధురవాంఛ గలచె నీ ప్రియహృదిని?
వలపుసుధల తొలకరించు నీకులుకుమోము
భ్రమను [illegible] వు.

మృదులమై దయాసౌరభ సదనమైన
నీహృదయపుష్ప మందిటు నిల్పితేల?
రాతిగుండెల మనుజుల పాతకముల
చిహ్నమగు గుడిలోని యీశిలను బాల!

కలుషపంకిలమైన యాకఠినశిలను
దేవుడందును కోర్కెల దీర్చునని
ఆసనాతనుల పలుకు లాదరించి
జీవితాశయముల బలిజేయబోకు.

అమృతపురుచి- విషగుణము లమరియున్న
ఛాందసపురాణములకు వశంబుగాకు
మాన్వి స్వార్థపరులధికారార్థముల
వ్రాసిపెట్టిన సామ్రాజ్యశాసనాలు.

మనుజహృదయాల కరుణనే మరపుగొలుపు
స్వామిగుడిలోని ఘంటారవాలె కాని
కటికగుండెల గరగించు కష్టజీవి
దుఃఖరావాలు నీచెవి దూరలేవా?





అకట దాస్యశృంఖల జిక్కి- అణగియున్న
దేశమాత పిలుచుచుండె దీనయగుచు,
కోమలీ! నీకుసేవల గోరి యదుగో!
ఈమదనుజాజ్ఞ వెనుక చింతించబోకు.

సరసహృదయ కవాటంబు దెఱచియుంచి
ఏయదృష్టమూర్తి పూజింపగలవో?
ఆమధురజీవనఫలంబు లందలేక
రాళ్లబడి ప్రాకులాడె దీగుళ్లలోన!

విఫలమయ్యె నీవాంఛ యోప్రియుని వలన,
వాడు దురదృష్టవంతు డైనాడుగాని;
విఫలమయ్యె నీవలన నోప్రియునివాంఛ
వాడె దురదృష్టవంతు డైనాడుగాని.

ప్రణయమకరంద పానసంభరితములయి
విశ్వమోహనములగు నీపెదవులనుంచి
ప్రతిఫలంబివ్వలేని యీరాళ్లపైన
వైచి ప్రకృతివిలాసమే పాడొనర్తె?

కోటివిటుల చక్కదనము కురుచపరచి
సొగసుదోలు కాదు నీనగు మొగము బాల!
ప్రణయసుధలొలుకు హృదయపుష్పంబుతోడ
ప్రేమమూర్తికి కానుకర్పించుమిపుడె.

శ్రామికజీవుల రక్తమాంసాలగుడిచి
శిల్పముల దాచినారు ఈ స్వార్థపరులు!
రాళ్ళుపాటియు వానిపై గుళ్ళుకట్టి
దేవుడనుపేర మనుజుల తెలివిమాపి.

మానినీ! మనసుంచి నామాటవినుము:
సత్యమును జాటునప్పుడు జంకు లేల?
సంకుచిత దృష్టి నెప్పు డీ స్వామిపేరి
గుళ్లకుజని మానవతయె గోలుపోకు.

మతముపేరి రాక్షసి మటుమాయలందె
బడి మధురజీవితంబును బలియొనర్పు
కొనకుమా! విశ్వకల్యాణమునకు మతమె
తోకచుక్కై సమానతం గాడిచినై చె.

---





# వేషధారి ★

దుమ్ముము దోకుమంచు కడుదూకుడుగా
నదలించి కష్టముల్
గొన్న మహాత్మ! కూలిగొనుకోసము
పాపము! ఆ దుర్భాగ్యులే
నిన్నటినుండి పస్తుబడి నీతలవాకిట
గోల పెట్టగా
గన్నులుమూసి యోజనము కైపున
నీట్లైన వెంతమోసమో!

ధరణి మహాత్ములన్ గొలిచి ధార్మికనీతియు
తత్త్వయోగముల్
గరచిన గొప్పవాడ! యిటు గారడిసేయుగ
జెల్లునయ్యా? ఈ
నరులతుసాది రక్తము నవారంతముగా
దిగద్రావ సాయమా
కరముల తావళంబు! గనుగప్ప జపంబు!
విభూదిమోముసన్!

నీపితరుల్ గడించి యిట నీకిడిపోయిన
ద్రవ్యసంపదల్
ప్రాపయినిల్వ పెద్దవను భావముతో
నిను జేరు రైతులన్
దోపిడి జేసి సజ్జనుల దూషణ
సేతులు వెల్కుచుందు నో
పాపిరో! మేకవన్నపులివో నిను
బోల్పదె లోకమింతకున్.

ఎందరి కొంపలార్చితివో! ఎందరి గుండెల
నల్ల బిండితో
ఎందరు తండ్రిబిడ్డలకు నిప్పులు
గొల్పియు వారిభూములన్
బొంది తపింప జేసితివో! పొందుగ
ధర్మముల న్వచించు నీ
ముందరిపండ్లు రాలిపడ, మూర్ఖుడ!
కాలము కన్నువిచ్చెరా!

ఈనరమాంసముం గుడిచి యెన్నిదినా
లరిగించుకొందువో!





మానవ రూపరాక్షస! ప్రమాదము తప్ప
దజీర్ణమొత్తు నీ
ప్రాణముదీయు! సత్యమిది! శ్రామిక
వర్గము కన్నువిచ్చె, న
జ్ఞాన తమస్సుపోయె, నిక సాగవు
నక్రముచర్యలీయెడన్

వేసముతో నమాయికుల పేదల
కష్టము లాహరించు నో
మోసపుభక్తులార! ధనమో
హావికల్పితచిత్తులార! మీ
మోసము సాగదోయి యికముందుకు,
కార్మికకర్షకాళి మీ
యాసలదీయు నుద్యమములందు గడించిరి
నాత్మజ్ఞానమున్.

---

# హృదయార్పణము! ★

మధువనంబున కోకిల మధుర కృతియు
పుష్పవతులౌ లతల. తేటిముగ్ధ పాట
కవి కుమారుని మనోహర కావ్యగీతి
ఉదయభానుని కిరణాల నుజ్జ్వలించె.

అలరు గన్నెలు మంచుముత్యాల కాన్క
బాలభాస్కరు గొల్చు ప్రభాత వేళ
పులకిత స్వాంతుడనయి నీపూజకొఱకు
నిలిచియుంటిని ఉత్త చేతులనుమోడ్చి.

ఏమియున్నది నాతల్లి యిపుడు నీకు
అర్పణము జేసి ధన్యత నందుటకును?
దాస్యబంధాల జిక్కి యేదారి లేని
నీదు దురదృష్టపుత్రుల నేనొకండ.

ఎడ తెరపిలేని వ్యథలచే నెంతొ కుమిలి
నవసి కృశియించి సగమయి శవ[illegible]కె
[illegible]నేల రాలగనున్న [illegible]మొగ్గ



బాష్పకణాలు

దేహమున మిన్కుమినుకని దీప్తినొందు
హృదయమున్నది; దీనినర్పింతు గొనుము.

---

# దేవుడా! ★

సంఘమునవరించు అక్రమాచర్యలకును
దైవఘటనమం చోదాత్తధర్మపరులు;
అంతకంటె మాకును నీకు నన్య బాంధ
వంబె లేదనుకొందు నాభావమందు.

దేవుడన్న నీవున్నావొ? లేవొ? గాని,
యున్న నెంతయో మాకు లేకున్న నంతె!
శ్రామికజీవుల రక్తమాంసాల గుడిచి
వారి నోదార్చ నీపేరు బ్రతికెవమ్ము.



